# ముందుమాట

కలకత్తా విశ్వవిద్యాలయంలోచదువుకునేటప్పుడు నాకు భాషాశాస్త్ర విషయాల్లో విశేషమైన స్ఫూర్తి కలిగింది. ఆనాడు చదువుకున్న భాషాశాస్త్ర వివరాలు చాలావరకు కాలగర్భంలో కలిసిపోయినా ఆ సంస్కారం నాలో కొంత మిగిలిఉండి ఈ పుస్తకం రాయించింది.

గురువులు సునీతీ కుమార్ ఛటర్జీ పదాల పుట్టుపూర్వోత్తరాల గురించి చెప్పిన విధానంతో ప్రభావితమై తెలుగు పదాల పుట్టుపూర్వోత్తరాలను అన్వేషించాలనే ఉత్సుకతతో 'తెలుగు దేశ్య వ్యుత్పత్తి నిఘంటువు' రాయడం జరిగింది. దీనిని విస్తరించి ఇతర పదాల చరిత్ర, ఆ పదాల చుట్టూ ఉన్న వాతావరణము 'శబ్దవైచిత్రి' వ్యాసంలో చెప్పబడింది. నేను చదువుకున్న కొన్ని అంశాలు అరవైఏళ్ళకు పైబడ్డా మరచిపోలేదు. అలాంటిది ఒకటి ఆటో జేస్పెర్సన్ రచించిన 'లాంగ్వేజ్: ఇట్స్ నేచర్, డెవలప్మెంట్ అండ్ ఆరిజిన్' అనే పుస్తకం లోని విషయాలు. వాటిని ఆధారం చేసికొని తెలుగుకి అన్వయించి 'శబ్దప్రతీకము' అనే వ్యాసాన్ని రాశాను. ఈ విషయం గురించి నా ఎరుకలో మరెవ్వరూ రాసినట్లు కనపడదు. సంస్కృతమునుండి ప్రాకృతము, ప్రాకృతమునుండి తెలుగు పదములు మారివచ్చిన విధము 'వైకృత పదావళి' లో చూపబడినది. సంస్కృత, ప్రాకృత భాషల్లో నిష్ణాతుడైన సుకుమార్ సెన్ ఉపన్యాసములు ఈ వ్యాసం రాయడానికి ప్రేరణ.

భాష సంస్కృతితో ముడిపడి ఉంటుంది. పూర్వ యుగములో ఉన్న మూల ఇండోయూరోపియన్ భాషా జనులు పశ్చిమముగా వెళ్ళినవారు యూరోపియన్లుగానూ, దక్షిణంగా సాగివచ్చి హిందూదేశమునకు వచ్చినవారు హింద్వార్యులుగానూ రూపొందారు. ఆర్యులు హిందూదేశానికి రాక పూర్వం ఇక్కడ నెలకొనియుండిన అనార్య జనులతో సమ్మిశ్రణము చెందిన ఫలితముగా బయలుదేరిన భాషా సాంస్కృతిక విశేషములను ఈ గ్రంథం నిరూపిస్తుంది.

ప్రాఙ్నన్నయ భాషా స్వరూప శైలీ విన్యాసములు ఏడవ శతాబ్దం నాటికే నన్నయశైలితో పోల్చదగిన కావ్యశైలి బయలుదేరినదని తెలుపుతున్నది. తెలుగు దేశంలో రాజవంశములు తదితరులు వేయించిన శాసనములు విశేషముగా ప్రకటింపబడినవి. ఇటీవలి భాషలో కొత్తగా బయలుదేరిన ధ్వనులకు తగిన లిపి సంస్కరణా విధానము సూచింపబడినది.

ఇట కొన్ని విషయములు గమనించవలసి ఉంది. భాషాశాస్త్రజ్ఞులు చెప్పిన కాలనిర్ణయము కొందరు ప్రాచీన పండితుల అభిప్రాయమునకు భిన్నమైనది. ఇక్కడ భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయము గ్రహింపబడింది. తెలుగు భాషా పరిశోధకులు ద్రావిడ భాషతోపాటు ఇతర భాషాకుటుంబములకు చెందిన భాషలను తెలుసుకొనుట అవసరం. ఇది భాష సమగ్ర అవగాహనకు తోడ్పడుతుంది. ఆధునికార్యభాషల్లో ప్రధానమైనదేకాక రాష్ట్రభాష కూడా అయినందున హిందీ భాషను గురించి ఈ గ్రంథంలో కొంత విపులంగా చర్చించడం జరిగింది. నన్నెచోడుని కుమారసంభవము నన్నయకు భిన్నమైన మార్గమును అనుసరించిన అత్యున్నతమైన కావ్యము. ఇందులో వివరింపబడిన ఆంధ్ర కవితా సంప్రదాయము, కన్నడభాష కవితా సంప్రదాయ ప్రభావము, జైన సంప్రదాయము, తమిళ పదముల వాడుక మొదలగునవి తెలుగుసాహిత్యంలో వేరొకచోట కనబడవు. విజయనగర సామ్రాజ్య కాలంలో జరిగిన సాంస్కృతిక భాషాసాహిత్యముల అభివృద్ధి ఆంధ్రదేశ చరిత్రలో విశిష్టమైనది కనుక ఇచట ప్రస్తావింపబడినది. మాళవదేశంలో జరిగిన కథ నామసామ్యమున రాజమహేంద్రవరములో జరిగినట్లు కథారంగము మారుట సారంగధరుని కథలోని విశేషము.

ఈ పుస్తకం పరిశోధనాత్మకమైనది. 'తిక్కన భాషా విశేషాలు' అనే వ్యాసంలో మొదటి వాక్యం '13వ శతాబ్దంలో భాష ఒక మలుపు తిరిగింది' అన్నప్పుడు అంతకు పూర్వాపరాలలో భాష ఏ విధంగా ఉన్నది అన్న ప్రశ్న బయలుదేరుతుంది. ఈ గ్రంథంలో వ్యాసాలు ఇలాంటి ప్రశ్నలు లేవదీస్తాయి.

సరస్వతీ స్తుతి మొదలుకొని భరతవాక్యం వరకు గల విమర్శనాత్మక, పరిశోధనాత్మక వ్యాసాలు భాషాభిమానులకు నూతన విషయములను ఆవిష్కరించి అలరిస్తాయని ఆకాంక్ష. కాలమే దీనికి ప్రమాణము.

**కోరాడ మహాదేవశాస్త్రి**

అనంతపురము

09-04-2014.

# వ్యాస సూచిక

* * * * *